# నా మాట

**1953** వరకు నేను అప్పుడప్పుడు రచించిన గేయాలు "జలపాతం" అనే పుస్తకరూపంలో ప్రచురితములైనవి. నాటినుండి నేటిదాకా తెలుగు స్వతంత్ర, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, స్రవంతి, కృష్ణాపత్రిక, ప్రజామత, తెలుగు విద్యార్థి మున్నగు పత్రికలలో ప్రచురితములైన గేయాలను ఈ పుస్తకరూపంలో దాచేపల్లి ప్రచురణ కర్తలు పఠితృ లోకాని కందిస్తున్నారు. తొలుత నా రచనలు ప్రచురించిన పై పత్రికల అధిపతులకు, తర్వాత వాటిని గ్రంథ రూపంలో అందిస్తున్న దాచేపల్లి వారికి నా కృతజ్ఞతలు.

హైద్రాబాదు
24-11-1955

— సి. నారాయణ రెడ్డి

# యౌవనం

మసక మసకగ బ్రతుకు
దెసల ముసిరిన బాల్య
తుహినావగుంఠనము
తొలగించి వెలువడిన
ఉదయ సంధ్యా కాంతి
నుపమించు యౌవనము.

తొలి సందె పవన వీ
చులతో పులకరించి,
లజ్జా మరంద రస
మజ్జన మ్మొనరించి
బరువుగా కనురెప్ప
లరవిచ్చు విరికన్నె
ముగ్ధ హాసమ్ములో
మొలకెత్తు యౌవనము.

ప్రతి వసంతమ్ములో
ప్రకృతి లక్ష్మి హస్త

పల్లవానీత మధు
పాత్ర రూపమ్ములో
రసికాళి హృదయాధ
రము లంటు యౌవనము.

యౌవనము జీవన వి
హాయస ధ్రువతార
యౌవనము శీర్ణ హృద
యమ్ముల కమృతధార
యౌవనము జీవిత
స్యందనాగ్ర పతాక
యౌవనము ప్రణయ వని
లో వసంతుని రాక
యౌవనము సంత్రాస
యామినుల మరపించు
సుఖచంద్రికా డోల
శుభతారకా మాల.

యౌవన మనోజ్ఞ మం
త్రా విగ్న జీవులకు
జడములో చైతన్య
జడధి పొంగులు తోచు

జీవలోకమ్ము ని
శ్చేష్టమై కనుపించు.
వర్ణ వైరూప్యము సు
వర్ణ శోభ వహించు
వికలాంగములు నూత
న కళల్ పిసాళించు.

చలువ వెన్నెల వెల్లు
వలు వేడిగా తోచు
మలయ మృదుల సమీర
ములు వాడిగా వీచు.

అంగములు లేని మరు
డస్త్రములు గుప్పించు
కోకిలలు మృదు కిన్న
రీ కంఠముల బిల్చు.

యౌవన వినూత్న శో
భా దీప్త యువతులకు
మెయి విరుపు; లవ్యక్త
మృదుహాస ఫేనములు;
బిబ్బోకములు; ప్రణయ
పిచ్చిల విలాసములు;

అలతి యలుకలు; వాలు
పలుకులు; కటాక్షములు;
కిలికించితములు; చ
క్కిలిగింతల తలంపు;
లనుభావములుగ ది
వ్యానుభూతిని కూర్చు.

యౌవన విచిత్ర సూ
త్రా కృష్ట యువకులకు
కోర మీసాల క్రొం
గోరికలు చివురించు
కనులలో గర్వ రే
ఖలు నాట్య మొనరించు.

తనువు బిగిసిన వీణ
తంత్రివలె త్రుళ్లిపడు
తలపులు గగనపుష్ప
తతులకై ఎగిసిపడు.

విధుబింబమే ప్రియా
వదనమై వెలుగొందు
ప్రకృతియే అందాల
పడతియై రూపొందు.

మిసిమి జవ్వనము తొ
ణ్కిసలాడు దంపతుల
కారు ఋతువులు అపూ
ర్వానంద హేతువులు.

గుండె లదరెడు మబ్బు
దండుల మహోర్భటులు
సళ్ళిన కవుంగిళ్ళ
ముళ్ల నేక మొనర్చు.

అభిసారికా జనుల
కాటంక మొనగూర్చు
శారద నిశీథులు వి
హార పాత్రములగును.

నరములను మంచు క
త్తెరలతో పీడించు
చలిరేలు గోరు వె
చ్చదనాల నందించు.

జగము లన్నిట నగ్న
ముగ జేయు శిశిరమ్ము
ఘుసృణ సంకుమద గం
ధ సమృద్ధి సమకూర్చు.

చంద్ర నిప్పులను ప్ర
స్తారించు మాధవము
పడుచు మొగ్గలు సిగ్గు
పడు వలపు లూరించు.

సుడి గాడ్పులను ధూళి
జడుల లేపెడు గ్రీష్మ
ఋతువు చెమ్మట లార్ప
ఎల తెమ్మెరల వీచు.

మిసిమి జవ్వనము తొ
ణ్కిసలాడు దంపతుల
కారు ఋతువులు అపూ
ర్వానంద హేతువులు.

యౌవనము నవచంచ
లా వల్లిక విధాన
క్షణికమైనను మధుర
సౌఖ్యదాయక మగును.

యౌవనము కలవోలె
అల్పకాలిక మయ్యు
గడియలో స్వర్గలో
కముల భూమికి దించు.

వర్షా పయోధరము
వలె నిండు జవ్వనము
గర్జించి గర్జించి
కడకు వెలవెలబారు.

శ్వేత శారద మేఘ
పోతమటు యౌవనము
కాలవాతూల ఘా
తాలతో చెదరిపడు.

బహిరంగములలోన
ప్రవహించు యౌవనము
క్రమముగా గ్రీష్మ కా
ల నది వలె శుష్కించు.

అంతరంగము లందు
అలలెత్తు యౌవనము
కలకాలము విపంచి
వలె కమ్మగా పాడు.

భీరువులలో యౌవ
నారంభమే లేదు
బాల్యముననే జరా
భర పిడితులు వారు

ధైర్యవంతులను వృ
ద్ధాప్య మంటగబోదు
శిరము నెరిసిన గాని
చిర యౌవనులు వీరు.

ప్రాణికి వయోదశా
పర్యాప్త యౌవనము
శాశ్వతారోగ్యము ప్ర
సాదింపగా లేదు.

ఉత్సాహ సంగతి స
ముద్భూత యౌవనము
జీవి నారోగ్య సం
ప్లావితునిగా జేయు.

యౌవనము సవ్య మా
ర్గానుగతమైనచో
బ్రతుకులో శాంతి సౌ
రభములు గుబాళించు.

యౌవనము వికట మా
ర్గాభిముఖమైనచో
జీవితము కంటక ప
రీవృతమైపోవు.

# " మేఘ సందేశం "

గుత్తులుగ వ్రేలాడు
గో స్తనుల చందాన
ఆషాఢమున వలా
హక పంక్తి కాలూన
కాళిదాసు హఠాత్తు
గా నాకు కన్పించె
తిన్నగా మేఘ సం
దేశమ్ము విన్పించె.

అలకాపురమ్మేడ
యక్షదంపతులేడ
వర్షాంబుధరముచే
వార్తావహనమేడ

చిత్రకూటమ్మేడ
శివుని పర్వతమేడ
గగన కల్లోలినీ
కనక సికతములేడ

సురత కేళీ జనిత
పరిఖేదమును బాపు
ఐందవ శిలా పరి
ష్యంది బిందువు లెచట

హ్రీమూఢ లెచట
కామార్తు లెచట
స్తన భరస్తోక న
మ్ర నవోఢ లెచట

ధనద శాపములేదు
దైవఘటనము కాదు
ఏడాది కాదొక్క
నాడు విరహము లేదు.

యక్షయువకుడు పుష్క
లావర్త మేఘమును
నిల్పి సందేశమ్ము
తెల్ప బూనగలేదు.

నవ్వవే మరల యీ
నాడు నా నెచ్చెలీ !
నా యిరుల బ్రతుకు కీ
నాడె దీపావళి.

నీ నవ్వుతో భువిని
నిండు దివ్వెలు వెల్గ
మట్టి దీపాలేల
ముట్టింతువో సఖీ !
నీ మోములో సింగి
ణీగములు నర్తింప
రంగుల 'మతాబా' వె
లుంగు లేలా చెలీ !

ఇంటి ముంగిట యేల
నే వేల దీపాలు
హృదయాంగణమున వె
ల్గించు మొక్కటి చాలు.
ఇరుచేతులందు సుం
దర దీపికలు బూని
ఇటు వైపు రావేమి
ఇభరాజ గామినీ !

దీపసుందరి ! నీవు
తిమిరలోకములోన
కనిపించినా వబ్ధి
జనితలక్ష్మి విధాన.

దివ్వె నీ చేత సం
దీపించగా నాకు
మిరుమిట్లు గొలిపె నీ
తరుణ లావణ్యమ్ము
గడప నడుగిడుచు అం
గణమందు దిగుచుండ
తడబాటుపడెను నీ
తంద్రి మధ్యము చెలీ !

చిరువేడి వెల్గులో
చెమరించి పోయితివి
సౌధ శృంగముపైన
సేదదీర్తువు లెమ్ము.

నడిరేయి దాటె ఇం
కను దివ్వెలేలా ?
కనులందు వెల్గె యౌ
వన దీపమాల.

# మాధవహేల

కష్టాలవలె ముసురు
కారుమబ్బుల దాటి
దుఃఖాలవలె జారు
తుహినధారల దాటి
పశువాంఛవలె రేగు
శిశిరానిలము దాటి
మరల యేతెంచితివ
మధుర మధుమాసమా !

'మన్మథ' ధనుర్ముక్త
మల్లికా హాసమా !

చూపుతోనే గుండె
లో పొగలు రేగించు

గ్రీష్మరాగిణి కొరకు
కేలు సాచగలేక
నవ్వుతోనే బ్రతుకు
నందు మంచులు దించు
హేమంత భామతో
జాము గడుపగలేక
మోడు వడిపోవు నా
లో మోదుగుం బూల
కాగడా లెత్తిన జ
గన్మోహినివి నీవు
రాగమాధ్వీక ధా
రా వాహినివి నీవు.

నీ పరిమళ స్ఫీత
నిశ్వాస లహరితో
పాగచూరు గుండెలో
పొందామరలు పూచు.

నీ మరంద స్నాత
నీల దృఙ్మాలతో
ఇగము వట్టిన యెడద
నిగురు మంటలు లేచు.

నీ వగ్ని శీధు పుం
జీభూత రూపమవు
ఈవు చల్లని జ్వాల
లెగబోయు దీపమవు.

మావి చివురులు మేసి
మత్తిల్లు కోకిలల
చేదు గొంతుకలందు
స్వాదు గీతులు లేపి,

శిశిర విషమారుత వి
శీర్ణ వృక్షాంగనల
దిస మొలలలో హరిత
వసనాల నందించి,

వెన్నుపోటులగాని
వినని మానవకోటి
పువుల చిరునవులతో
డ వశీకృత మొనర్చి,

భువిని నందన వన
మ్ముగ మార్చు ఆమనీ !
కవి హృదిని పలికించు
గంధర్వ భామినీ !

## మదనోల్బణం

ప్రావృషేణ్య పయోద
భార మోర్వగలేక
గగన భామిని నడుము
బిగిదప్పి యల్లాడె
గగన భామిని నడుము
బిగిదప్పి యల్లాడె
విరహ వేదనలు ని
ద్దుర లేచి పొరలాడె.

అస్తసూర్యుడు చుంబ
నాత్మక క్రియ సల్ప
సంధ్యా లతాంగి రో
ష కషాయ ముఖియయ్యె

సంధ్యాలతాంగి రో
ష కషాయ ముఖియయ్యె
కుసుమాస్త్రుని పతాణి
ఖురధూళి పెల్లయ్యె.

కలలో ప్రియుని జూచి
పులకించు రేరాణి
శిఖలోని తారా క
ళికలు జలజల రాలె
శిఖలోని తారా క
ళికలు జలజల రాలె
ప్రణయ భావనలు తి
రని మత్తులో తూలె.

ఫాలస్థ నీల తిమి
రాలకమ్ములు వాపి
ప్రాగ్దేవి పూర్ణ చం
ద్ర తిలకము సవరించె
ప్రాగ్దేవి పూర్ణ చం
ద్ర తిలకము సవరించె
వలపు టెదలందు వె
న్నెల చిచ్చులను దించె.

# హేమంత విరహిణి

ఎండకాల మ్మొదుట
మండి పోయిన నాడు
వానకాలము గుండె
లోన కురిసిన నాడు
నను వాలుచూపు బం
దాలలో నిల్పితివి
నేటి చలివేళ న
న్నేల విదలించితివి ?
జాణతనమా సఖీ !
ఓ నా పరాఙ్ముఖీ !

క్షణకాల మేకాంత
మును వహింపగ లేను
కనుల ముందే వియో
గము సహింపగలేను

హేమంత సంధ్యలో
ఈ యలుక లేల ?
ఇదియటే వలపుల ప
రీక్షలకు వేళ ?

చూపుతో నా గుండె
లో పొగలు రేపితివి
చిరునవ్వుతోడ చి
చ్చు రగిల్చి పోయితివి
పొగ మూగి, చండ్ర ని
ప్పులు రేగి, జ్వాలికలు
భగ్గుమని మండ కో
పముతోడ లేచితివి
ఎటుల నోర్తును నేను
చటుల విరహాగ్నులను
ఎటుల నీదుదు నేను
హేమంత రాత్రులను.

ననువీడి వేరు పా
న్పును చేరగాలేవు
పది గజమ్ముల మేర
ఒదిగి నిల్చున్నావు.

ఏ నాయికవు చంచ
లేక్షణా! నీవు
ఎదురుగా నిల్చేవు
ఎడబాసి పోవు.

ఊరకయె కుంపటిని
ఊదుచుంటి వదేల?
తరుణిరో! కౌగ్లివ్వ్వెచ్చ
దనము కావాలా?

ఇంత దానికి కిన్క
యేలనే రారమ్మ
నా కవుంగిలి అర్ప
ణముసేతు గైకొమ్మ.

ఊది నప్పుడె మండు
బూది కుంపటికన్న
కలకాలముండు కౌ
గిలి కాదటే మిన్న.

కాశ్మీరు శాలువలు
కంబళులు దుప్పటులు
మంచు దాడులను త
ప్పించలేవో సఖీ!

గగన చుంబి మనోజ్ఞ
కనక హర్మ్యములైన
చలిగాడ్పు దెబ్బలకు
నిలువ లేవో చెలీ!

మన మనసులందు వె
చ్చని ప్రణయ దీపికలు
మండినన్నాళ్లు హే
మంతమె వసంతమ్ము.

మన యెడందలు ఏక
మై పోయిన దినాన
లోకాన చలికాల
మే కన్పడదు చాన!

లోకమ్ము కోసమై
నా కామినీమణీ!
పరిరంభ మీయవే
ప్రణయ కోపము మాని.

పరిరంభ మీయవే
ప్రణయ కోపము మాని
ఓ నా పరాఙ్ముఖీ!
ఒంటి వాడను సఖీ!

# మిసిమి వలపు

పృథు పయోజ భారము కం
పించిన సహియింతు గాని
పలుచని నడుమల్లాడగ
భరియించగలేను సఖీ !

నెరనవ్వుల పిడుగు జడులు
కురిపించిన సైతుగాని
ముసి ముసి నవ్వుల తూపుల
కొసల కోర్వలేను చెలీ !

కీల్జడ వ్రేటులతో పరి
ఖిన్నుడ గాలేను గాని
జడలోపలి పూలు జారి
పడుట చూడలేను సఖీ !

పవలంతయు వికచ నేత్ర
పద్మమ్ముల జూతుగాని
నిముసమైన వాలుచూపు
నీడల మనలేను చెలీ !

ప్రణయకోప సంజనితా
నన శోణిమ నోర్తుగాని
నుదుటరేగు బొమముడి ముం
దుగ నిల్వగలేను సఖీ !

# తరంగాలు

ప్రాచీదిశా కుడ్య
భాగాల నెగబ్రాకి
రోచిర్లతలు తొంగి
చూచినవి పూచినవి.

కొమ్మలటు పెనవేసు
కొన్న యుపదంపతుల
గాఢోప గూహన
గ్రంథులు సడలు నేమొ ?

అస్తగిరి మకుట వి
న్యస్త దినమణిబింబ
మారముగ్గిన పండు
తీరుగా రాలినది.

బిడియపడు పడుచు కీ
ల్జడలోని మల్లియలు
చెలుని రాకను దెల్ప
కిలకిలా నగునేమొ ?

ఆషాఢ నీలాంబ
రావిష్కృతాంభోద
పాళికలు మత్తేప
పంక్తులై తూలినవి.

విరహ ప్రబంధేతి
వృత్తమున కల్లాడు
ఏ లలిత కవిరాజు
కాళిదా సగునేమొ ?

చంద్ర నిప్పాలలోన
చైత్ర సుందరి లేచి
మధుర మాధ్వీక దృ
జ్మాలికలు సారించె
శిశిర ప్రభంజన వి
శ్లిష్ట రసిక బంభ
రాళి శీధువు గ్రోలి
తూలి పడునో యేమొ ?

శాంతి ప్రసూనాలు
జాలువారిన ఆకు
పచ్చని ధరామంట
పాన చిచ్చులు రేగె

కోట్ల యుగములనుండి
కుసుమించు మానవత
మసృణ వదనమ్ముపై
మసిముద్ర పడునేమొ ?

## “భావకవి ఆవేదన”

నా చుట్టు లేచు సం
ధ్యా తమస్సును మాప
నెలత నీ చూపు వె
న్నెలలే శరణ్యములు.

నా ముందు బుసగొట్టు
నాగుపడగల నూప

రమణి నీ కంఠ స్వ
రములే అనన్యములు.

నా చెవుల దూరు నిం
దా ధ్వానముల నాప
వనిత నీ పాద కిం
కిణులే సమర్థములు.

నా మీద పడు నిరా
శా మేఘముల ఁబోప
కోమలీ నీ పైట
కొసలే సమర్థ్వములు.

నా వెంట నంటు ఉ
న్మాదాగ్ని చల్లార్ప
తన్వి నీ స్మేరాంబు
ధారలాధారములు.

నా యింట నూఁదు ద్వే
షాయుధమ్ముల గూల్ప
సకియ నీ ప్రణయ లా
స్యములే అమోఘములు.

## ఆహ్వాంతి

మొగలిపూల మొగము మొత్తు
మగువ నగవు విలోకించి
కేలు సాచినాడ కంట
కాల జాడ విస్మరించి.

ఆకాశం రూపు మాపు
అతివ నెన్నడుమును జూచి
పట్టనెంచితిని శూన్యము
పట్టువడదటంచు మరచి.

బరికత్తుల మొండిపరచు
తరుణి దృగంతాల వలచి
కౌగిలి కోరితిని పచ్చి
గాయమ్ముల మాట మరచి.

త్రాచుల పడగలను దించు
తన్వి బారుజడను జూచి
తాక నెంచితిని కన్నున
తగిలెడు కాటులను మరచి.

ధనుస్సుల మొగాలు వంచు
వనిత కన్బొమలను జూచి
పరుగు వెట్టితిని బాణ
ప్రహారాల మాట మరచి.

నిప్పును బూడిద జేసెడు
నెలత సుందరతను జూచి
కలియగోరితిని శలభము
వలె ఆహుతి యగుట మరచి.

# ఉడ్డీనం

ఎగిసి పో ఎగిసి పో ఎగిసి పో
యుగయుగాల తమోంధ
జగతి నుల్లంఘించి
ఎగిసి పో—

నీ కళ్ళలో వెల్గలేని యీ తారకలు
నీ గుండెలో విరియలేని యీ చంద్రికలు
నీ చెమట తడి యార్పలేని పవనోర్మికలు
బ్రతికినా చితికినా
ఫలిత మొకటేనోయి
ఎగిసి పో—

పలుక నొల్లక దేవు డిలపై శిలగ నిల్చె
వెలుగ నొల్లక చంద్రముడు కళల తగ్గించె
కననొల్లక నినుండు కనుల నిప్పులు రాల్చె
ప్రకృతి సర్వమ్ము నీ
పై కత్తులను దూసె
ఎగిసి పో—

పిడుగు పిండులను కురిపించని జలధరాలు
మంచుకోతలులేని మంజు హేమంతాలు
శైశిరభయంలేని శాశ్వత వసంతాలు
కాపురమ్మున్న లో
కమ్ములో నివసింప
ఎగిసి పో ఎగిసి పో ఎగిసి పో
యుగయుగాల తమోంధ
జగతి నుల్లంఘించి
ఎగిసి పో—

# జలదగీతి

సాగుమా ఓ నీలమేఘమా
గగనవీణామృదులరాగమా

బీటవారిన చేల
పీయూషములు రాల
గరికలేని పొలాల
మరకతమ్ములు దేల
సాగుమా ఓ నీలమేఘమా
గగనవీణామృదులరాగమా

నెమలిపాదాల కిం
కిణులు 'ఘల్లు'న మ్రోయ
ప్రియురాలి వలపు మ
ల్లియలు 'జిల్లు'న పూయ

సాగుమా ఓ నీలమేఘుమా
గగనవీణామృదులరాగమా

కవిరాజు నిను జూచి
నవనీతమై పోవ
నవనీతమై పోవ
నవగీతమై లేవ
సాగుమా ఓ నీలమేఘుమా
గగనవీణామృదులరాగమా

నినుజూచి విరహిణులు
నిట్టూరుపులు నింప
నిట్టూరుపులు నింప
నిలువెల్ల పులకింప
సాగుమా ఓ నీలమేఘుమా
గగనవీణామృదులరాగమా

గుండెలోతుల పాదు
కొన్న పాతదనాలు
నీ పదమ్ములు తాకి
నీరు నీరై పోవ
సాగుమా ఓ నీలమేఘుమా
గగనవీణామృదులరాగమా

# ఎంత జాలి

ప్రాఙ్నగాగ్రమునందు పొడిచిన
బాలసూర్యుని కంటి సెగలకు
భగ్గుమనెడు తమిస్రముఁ గన
'పాప'మనిపించు.

ప్రబల ఝంఝాపవన ధాటికి
బదాబదలైపోవు శారద
నీరదావళి కంటబడగ 'ను
సూరు' మనిపించు.

జేతవలె కవిసిన వసంతుని
చికిలివారిన కుసుమరథ చ
క్రాల నలిగెడు శిశువు దలపగ
జాలి చెమరించు.

# ఆలోడనం

విషద్రావకము ద్రాక్షా
రసమని గుటగుట మ్రింగెడు
పిపాసువును గేలిచేసి
పీయూషము ద్రావితినా

ఎండమావులందు సుధా
భాండాగారము జూచెడు
ఆశాజీవిని కాదని
ఆనందము పొందితినా

మబ్బుతునకలతో ప్రణయ
మధుర వార్తలను పంపెడు
కామార్తునికేరి వియో
గ జ్వాలిక లార్పితినా

కాంక్షాసిద్ధికి హారతి
కర్పూరంవలె కరగెడు
సాహసి నెగతాళిజేసి
జయశ్రీ వరించితినా

ఊహాలోకమున అప్స
రోంగనలను దర్శించెడు
భావకవిని పరిహసించి
బ్రహ్మపదము నందితినా

ప్రణయవీణలోన సృష్టి
రహస్యరాగాలు వినెడు
తాత్వికుని తిరస్కరించి
తాదాత్మ్యము నొందితినా

# స్వాగతం

పొడిపోయెడు పుడమి గొంతు
తడుపగ రాలిన చినుకును
శుక్తి గర్భమందు జారి
ముక్తాఫల మెటులైతిని

నిశీథాంతమున తూరుపు
దెస కన్విప్పిన తారను
తమోబాధితుల నయనో
త్సవ కారణ మెటులైతిని

జనపదమ్ములకు దూర
మ్మున నిల్చిన మొండిశిలను
అగ్రవర్ణపూజిత సా
లగ్రామ మ్మెటులైతిని.

అరనిముసం వెల్గి ధూళి
పొరలందారెడు పూవును
పరమేశ్వరకంఠహార
తరళహార మెటులైతిని.

బెబ్బులి పిల్లల నొడిలో
పెంచిన మార్త్యాల గుహను
పల్లవాధరలు వెలసిన
ఎల్లోరా నెటులైతిని.

చిరుతగాలి కెరటాలకు
చెదరిపడు మొయిలు తున్కను
యక్షమిథున సందేశ వ
హన సాధన మెటులైతిని.

లోకుల నిష్ఠురపదాల
లో త్రొక్కుడువడు మట్టిని
వికచకాంతి వలయిత దీ
ప కరండిక నెటులైతిని.

# నేను

కాలపన్నగ ఫణా
గ్రముపైన చెయిసాచి
మణిని సంగ్రహియించు
మాంత్రికుండను నేను
మాంత్రికుండను నేను
మానవుండను నేను.

ముండ్లలో కగ్గిలుపు
మొగలిరేకులలోని
తావులను హరియించు
తస్కరేంద్రుడ నేను
తస్కరేంద్రుడ నేను
తరుణ పవనుడ నేను.

కారుకాటుక జారు
నీరదావళి నుండి
పాలధారలు పిండు
అలకాపరి నేను
అలకాపరి నేను
కాలపురుషుడ నేను.

## సందేహడోల

నింగి కడలిని ప్రయా
ణించు నీలిమొయిళ్లు
నన్నవలి దరిచేర్చు
నౌక తేనాపోనా.

స్ఫటిక ధౌతమ్మైన
చంద్రబింబమ్ము నా
అంతరంగము జూపు
అద్ద మేనాడౌనొ

కనులందు వెల్గు వా
కలు చిందు తారకలు
నా దారి చూపు క
న్నాప లేనాడౌనొ

చదలేటి బంగారు
సైకతస్థలులు నా
పదముద్రలను దాచు
పటము లేనాడౌనొ

అమృతరక్షణాల
లైన స్వర్గాలు నా
వాంఛలకు పర్యాయ
పదము లేనాడౌనొ

ఊహకందగలేని
ఉత్తాల గగనమ్ము
న న్ననిమిషునిజేయు
నాక మేనాడౌనొ

# ఉభయ సంధ్యలు

అశ్రువిపంచి ఝంకృతిలో తా
దాత్మ్యము పొందిన దెవ్వరు—నేనే
కింశుకహాస మరందరసం కను
గిన్నెల దాచిన దెవ్వరు —నీవే
సురస్రవంతీ తరంగఘాటికి
ధరపై రాలిన దెవ్వరు —నేనే
అప్సరసలకు విహంగమవృత్తిని
అలవడజేసిన దెవ్వరు —నీవే

కంటకతల్పమ్మున ఎలప్రాయపు
గడియలు గడపిన దెవ్వరు —నేనే
వెన్నెల తీగెల పాన్పున నిద్రకు
వెలియై జడిసిన దెవ్వరు —నీవే

కాటుక కురిసెడు కాళవిభావరి
కౌగిలి కోరిన దెవ్వరు —నేనే
చలువలు విరిసెడు చాంద్రీడోలల
చలనము సైపని దెవ్వరు —నీవే

ప్రళయాబ్ధి శిరోభాగమ్మున కల
లను నిర్మించిన దెవ్వరు —నేనే
నందన కానన మధ్యమ్మున ఆ
నందము పొందని దెవ్వరు —నీవే

హాలాహలమును అమృతం పోలిక
ఆస్వాదించిన దెవ్వరు —నేనే
క్రమసుధాద్రవమును సలిలంవలె
గండూషించిన దెవ్వరు —నీవే

పశ్చిమ సంధ్యాంబుధిలో పగిలిన
పడవను నడిపెద రెవ్వరు —నేనే
ప్రాచీదిక్తటలమ్మున కుంకుమ
పంకము పులిమెద రెవ్వరు —నీవే

# వింత మానవుడు

బ్రతుకంతా అగ్నిశిఖా
చిత పథాల ప్రయాణించి
జ్వాలనమ్మనగా నేమో
తెలియక వికవిక నవ్వేడు
నేను వింత మానవుడను.

నిరంతరం హిమగిరీంద్ర
నిర్దగ్ధంగా లహరుల
నిండుగ తానమ్ములాడి
గుండెమంట చల్లార్చని
నేను వింత మానవుడను.

పారిజాత పరిమళ సం
భారమ్ములు గుబాళించు
నందనమున మోదుగు పూ
లం దలపోసెడు వాడను
నేను వింత మానవుడను.

శరత్పూర్ణ హరిణాంకుని
తరళిత హాసములపైన
నీలిమొయిలు మేలిముసుగు
నీడలు వాల్చగ నెంచెడు
నేను వింతమానవుడను.

ఇరుల కంతముల తరిగెడు
కరదీపిక పారవైచి
అందని మిణుగురుల కోస
మన్వేషణ సాగించెడు
నేను వింత మానవుడను.

దీనమానవుని రోదన
దిశలను భేదించ వాని
కనులు చెమ్మగిలెనొ లేదొ
యని ఇంచుక తొంగిచూచు
నేను వింత మానవుడను.

చీకటిలో నిల్వలేక
చిరుదివ్వెను వెలిగించి
శలభహత్య చూడ గుండె
చాలక దీపమ్మార్పిన
నేను వింతమానవుడను.

అప్సరోంగనలు మనోజ్ఞ
హల్లీసకములు జూపగ
విలయతాండవము కోసము
వెర్రిగ పర్వెత్తువాడ
నేను వింతమానవుడను.

అమృతభాండ మెగిసివచ్చి
హస్తయుగమ్మున నిల్వగ
నిన్నటి విషపానగాథ
నెమరువేసికొనసాగెడు
నేను వింతమానవుడను.

పశ్చిమ దిక్శైలాంచల
పతత్ పతగ బింబములో
రేపటి అమృత ప్రభాత
రేఖల సందర్శించెడు
నేను వింతమానవుడను.

బ్రహ్మజ్ఞులు నిర్గుణుడే
పరమాత్ముండనగ వినక
రాతిబొమ్మలకు గంధపు
పూతలు పూసెడువాడను
నేను వింతమానవుడను.

## ఉద్గాపిం

ఈ సముద్రమథనోద్యమ
మిటులే కొనసాగింతును
హలాహలజ్వాల లమృత
కళికలుగా మారువరకు.

ఈ సర్ప మహాయాగము
నిటులే నిర్వర్తింతును
తక్షకుని ఫణాగ్రవిష
ద్రావ మిగిరిపోవువరకు.

ఈ సంధ్యారుణదీపము
నిటులే వెల్గించి చూతు
చీకటి బాకులు వెలుంగు
రేకులుగా మారువరకు.

ఈ ఆకాశోడ్డీనము
నిటులే కొనసాగింతును
అప్సరసల విద్యుత్ చే
లాంచలమ్ము లందువరకు.

ఈ దుర్గమ విపినమ్మున
నిటులే నడయాడుచుందు
ముళ్లగుంపెలందు బొందు
మల్లెలు వికసిల్లు వరకు.

ఈ కవితా శీధురసము
నిటులే యందించుచుందు
మత్తులోన జగతి కృత్రి
మత్వము విడిపోవువరకు.

# సంప్రశ్నం

అచ్ఛిన్నమ్ముగా ఉడ్డీ
నాసక్తుడనైన నన్ను
కట్టివేయు నెంచితివా
కఱవోని వెలుంగుత్రాళ్ళ

అనవరతం వార్ధితరం
గాఘాతుడ నైన నన్ను
దాటింపగ నెంచితివా
తలిరుటాకు నౌకపైన

రేబవళ్ళు నిద్రా ము
ద్రిత నేత్రుడనైన నన్ను
మేల్కొల్పగ నెంచితివా
మిహికామృత సేచనమున

గడెగడియకు శంకా పం
క నిమగ్నుడనైన నన్ను
తరలింపగ నెంచితివా
సురగంగా సైకతముల

# ఆత్మశోధన

తన ఐశ్వర్యపు పొంగును
గని మిడిసిపడంగనేల
అబ్ధిని గుటగుటమ్రింగిన
అగస్త్యర్షి యొకడుండగ

తన ఘన బాహాశక్తిని
గని ఎగిసి పడంగనేల
కొండల రెక్కలు విరిచిన
కులిశాయుధు డొకడుండగ

తన భయద స్వరము విప్పి
జనులను బెదరించనేల
ప్రళయమేఘముల బాపిన
పవనమూర్తి యొకడుండగ

తన విషచేష్టలతో జగ
తిని కలుషము చేయనేల
కాళియుని తలదన్నిన
బాలకృష్ణు డొకడుండగ

తన విజయాంకముల జూచి
దర్పము చెందగనేల
మదనుని బూడిద జేసిన
మహాశివుం డొకడుండగ

# ఉగాది పాట

కాళిదాసు కావ్యంవలె
కన్పించినది ఉగాది.

సమ్రాట్టును ఎదిరించిన
సాదా సైనికుని నుదుటి
కాంతి గర్వరేఖలాగు
కదలాడినది ఉగాది.

ప్రియుడు వరుడుగా మారే
విశ్వాసం ప్రబలినంత
తొలి జవ్వని చూపు తెరల
తొణికిసలాడే కాంక్షల
ఇంద్రధనుః ఖండంవలె
ఇదిగో ఇదిగో ఉగాది.

మత్తేభాల విధమ్మున
మల్లాడిన కార్మేయిళ్లు
శార్దూలపు కోరలవలె
జడిపించిన చలిరాత్రులు

నీరుగారి బీరుపోయి
నేటికి కొంగ్రొత్తదినం.
చిరుచేదుల తీయదనం
చలచల్లని వెచ్చదనం
తొలకిన మధుగీతిగణం.

కూలనున్న రాచవారి
కోటలాగు గతశిశిరం
శిరమెత్తుక కొన్నినాళ్ళు
తిరిగిన సంగతి నిజమే
వడిగాడుపు దుశ్శాసను
వలె దరిద్ర తరు తరుణీ
వస్త్రము లొలిచిన మాటయు
వాస్తవమే నూరుపాళ్లు.

ఐన నేమి ఆ దృశ్యం
అమితకాల మాగలేదు
మధుమాసాంకం నేడే
మరలగతం తిరిగిరాదు.

మధు మాసాంకమున రంగ
మధ్యమ్మున నిల్చుపాత్ర;

లదిగో మల్లీ మిత్రం
మందార వికచ నేత్రం.

నాయకు డదిగో చైత్రుడు
అతనివెంట ప్రియమిత్రుడు
'మన్మథ' నామాంకితుండు
మరల మనకు కన్పించడు.

అగ్నివంటి మెయివన్నియ
అమృతం సరియగు కన్నియ
ఆమే నాటక నాయిక
ఆమె పేరు మధుబాలిక.

పలాశాలు నడిచివచ్చి
విలాసమ్ముగా నాడెను
పరభృతాలు కమ్మని వి
ప్లవ గీతమ్ములు పాడెను.
అరవిందమ్ములు చూపెను
హల్లీసక నృత్యమ్ములు
అశోకములు లేపెను సం
ధ్యా శోణపతాకమ్ములు
మధుమాసాంకం నేడే
మన కుగాది ఈ నాడే

# " శోకః శ్లోకత్వమాగతః "

కిరాతకుని కరాళశస్త్రం
క్రౌంచపక్షి గుండెను చించిన అలనాడు
కవి హృదయం చెమ్మగిల్లి
కన్నీళ్ళు చితికింది.

బాణాగ్రం నేరుతేని
ప్రాణాలను తోడేస్తుంటే
పరిసరాలు మూకీభవించాయి
కవిమాత్రం శ్లోకించాడు.

శ్లోకమంటే మరేమీ కాదు
"శోకః శ్లోకత్వమాగతః".
వేదనయే కవిత్వానికి
బీజప్రాయం సుమా!

సాధారణ మానవుడు
స్ఫటికంలాంటివాడు
ప్రక్క రంగులకు లోబడి
వ్యక్తిత్వం కోల్పోతాడు.

కవిని మాత్రం సూర్యునితో
ఖచ్చితంగా పోల్చవచ్చు
ఏడు వన్నెలు జీర్ణించుకొని
ఏకవర్ణం చిమ్ముతాడు.

మంచుగుడ్డలు కప్పుకొన్న
మానవుల మెదళ్ళలో
వేడి కిరణాలందించే
వాడె కవి, వాడే రవి.

అవనిలోని ప్రత్యణువూ
కవికొక బ్రహ్మాండం
అతనిగుండె కదుపలేని
అణుశకలం లేనే లేదు.

అణువులోన నిద్రించె
అంతర్జాతీయత్వాన్ని
పసికట్టి వీపుదట్టే
ప్రబల దార్శనికుడు కవి.

పరమాణువు ముఖంలోన
తెరచుకొనే మరణదంష్ట్రల
మాటలతో కరగించే
మహా మాంత్రికుడు కవి.

సాటివాళ్ళు మూఢత్వపు
సారామైకంలో పడి
పేలుతుంటే జాగృతి ఓ
పా లెత్తినవాడు కవి.

బురదలోన బ్రతికే కు
మ్మరి పురుగుల లేవనెత్తి
బంభరాలుగా మార్చే
బ్రహ్మత్వం కవిలో వుంది.

చెదలు దిన్న హృదయంతో
మసిబట్టిన మనస్సుతో
మాటలు గిల్కేవా డె
నాటికి కవి కాడు.

పరుల బాధ తన బాధగ
పంచుకొన్నవాడే కవి
పరుల సుఖంలో శిరస్సు
పైకెత్తినవాడె కవి.

పుచ్చపూలు గచ్చపొదలు
జిల్లేడులు పల్లేరులు
కవికలం సోకితేనే
కల్పవృక్షాలవుతాయి.

తుహినాచల శిరంనుండి
తురగలించే జలపాతాలు
కవిగుండెలో విద్యుత్తును
కల్పించక మానవు.

జగత్తులో ఏ మూలో
పొగచూరిన నరజాతుల
వీపులపై విరుగుతున్న
వెండి కొరడా దెబ్బలతో
కవికళ్ళలో ఎఱ్ఱడాళ్ళు.

పడమటి దేహళ్లు హుషారుగా
పరచిన బంగారు వలల్లో
పావురాళ్ళ కాళ్ళిరుక్కుంటే
కవిగొంతుక లోయలోంచి
గర్జించిన చప్పుడు.

పచ్చిగడ్డిలా పెరిగిన పల్లెవాళ్ళపై
ఆకాశంనుంచి రాకాసులు
అగ్నివర్షం కురుస్తుంటె
కవిశిరస్సును చీలుస్తూ
ఎగుస్తుంది ప్రతినాదం.

ప్రయోజనం లేకుండా పొడిచే
పగటి చుక్కలకు
దూరంనుంచి తోకాడించే
ధూమకేతువులకు
ఎవడి కాంతినో ఎరువుదెచ్చుకొని
నిగనిగలాడె చంద్రబింబానికి
పనిలేకుండా పరిభ్రమించే
వగైరా గ్రహగోళాలకు
క్షణంసేపు మిడిసిపడే
మిణుగురు పువ్వుకు
అకారణంగా ముఖం చిట్లించుకునే
అస్తమయ సంధ్యకు
అణువుకూ బ్రహ్మాండానికి
జీవికీ మృత్పిండానికీ
కర్మసాక్షి కవియే
కవియే భారవియే.

సహారాలో సలిలస్వర్గం
శూన్యమనుకొంటున్న గగనసౌధానికి
చుక్కల కంకరతో
చెక్కినమార్గం;
చీకటి ఖంజర్ల పోట్లతో

చిరిగిన లోకం గొంతుకలో
చిరువెల్గుల ప్రాణభిక్ష.
శిశిరాత్ముల పశువాంఛాతృప్తికి
వశమై, వసనాలను పోగొట్టుకొన్న
కాలమనే బిచ్చుకత్తె మానరక్ష.
దాస్యపు నల్లమందు నమిలి
తరాలకొద్ది గురకతీస్తున్న
తమోవాసుల జాడ్యకుడ్యాలను
పగులగొట్టే వజ్రహస్తం.
పిరికితనం వారసత్వంలా
సంక్రమించిన శరణాగతుల
పిల్లిగొంతులలో సాహస
భీషణమర్దల ఘోషలు
పెకిలించే శంఖస్వరం;
ఇదే కవితా స్వరూపం.
ఇదే కవి విశ్వరూపం.

ప్రణయం ఒక తుమ్మెదలా
మనస్సులో మర్మరిస్తుంటే
ప్రేయసి ఒక తుమ్మెదలా
ఎదలో కదలాడుతుంటే

భవిష్యత్తు ముళ్ళులేని
ప్రసవపథంలా కనుపిస్తే
బ్రతుకొక చక్రాలులేని
ప్రసవరథంలా ఎదురొస్తే
కవిగొంతుక తేనె తేనె
గా పల్కగ తప్పదు
కవిలో సౌరభాలు రె
క్కలు విప్పక తప్పదు.

శరన్నిశీథులు పగళ్ళపై
దురాక్రమణ సాగించి
మృత్యుభామ ముడికొప్పును
జీవన పురుషుడు సడలించి
సెలవేసిన విద్వేషాన్ని
సౌహార్దం కత్తిరించి
జగత్సర్పమొక్కటూటు
సడలిన కుబుసాన్ని విడిస్తే
కవిహృదయం నాగస్వరమై
రవళిస్తుంది
కవిగీతం రాగాంకురమై
చివురిస్తుంది.

# స్వప్నచారి

ఆశలనే ఆకాశపుష్పాలకు
ఆకారం కల్పించుకొని
ఆనంద సౌరభాలను తాగేస్తాడు
స్వప్నచారి.
స్వప్నచారి మేధావాటికలో
పురివిప్పిన ఆలోచనల నెమళ్లకు
పింఛాలనిండా నిప్పుల రవ్వలు.
స్వప్నచారి అంతర్వాటికలో
వేషంగట్టిన వేదనాలాసికలకు
సిగలనిండా జిల్లేడుపువ్వులు.
ముంగురులు త్రాచుపాముల్లా
బుసకొడుతుంటే
కెంగేళ్ళు జెర్రిపోతుల్లా
క్రేళ్ళురుకుతుంటే
మెరుపు తీగెల్ని పలువల్లా
మలచుకొన్న విలయాంగన
స్వప్నచారి హృదయచోరిణి
అతని గుండె మెట్ల నధిరోహించే
అంత స్సంచారిణి.

ప్రణయం దావాగ్నిలాగా
అణువణువును కబళిస్తుంటే
ఊహల రెక్కలపై
ఉద్వేగంగా ఎగుస్తాడు స్వప్నచారి.

అతని అగస్త్య దాహం ఆరడానికి
సహారాలు సైతం సముద్రాలు కావాలి.

నింగిలోని నీలిమబ్బులన్నీ
నిండు మధుభాండాలనుకొని

ఆశాచషకాన్ని పైకెత్తి
మోసపోతాడు స్వప్నచారి.

చంద్రబింబాన్ని చుంబించాలని వెళ్ళి
విఫలుడై వెనక్కి తిరుగుతాడు.

చుక్కల చెక్కిళ్ళు గిల్లాలని
ఎక్కడలేని తాపత్రయ మతనికి.

ఇంద్రధనుస్సును పట్టుక వ్రేలాడాలని
ఎంతగానో ప్రయాసపడుతాడు.

స్వప్నచారికి ఏదీ సాధ్యంకాదు.
అయినా అన్నీ అతనికి
అరచేతి వైకుంఠాలే.

# అభ్యుదయ కవి అన్వేషణ

హిమం దాడితో పగిలిన
ఎర్రని పెదవుల లోపల
ఇవుళ్ళు తొడిగే గడియ కోసం
ఎదురు చూస్తున్నాడీ కవి.

కనపడ్డ ప్రతివాని మీద
మణుములకొద్ది దుమ్మెత్తిపోసి;

అందమైన ప్రతిదాని వలువలు
అకారణంగా ఒలిచివేసే
శిశిరాత్ములను దెబ్బదీసే;
చిత్రమైన మనిషి కోసం
పలాశ పతాకను ధరించి
విలాసంగా నడిచి వచ్చే
విప్లపకారుని కోసం
మందారంవలె నవ్వే
సుందర హృదయుని కోసం
మల్లికవలె మాట్లాడే
మానవ మిత్రుని కోసం
గడచిన కొన్నాళ్ళనుండి
గవేషిస్తున్నాడీ కవి.
టిక్కెట్టులేక లభియించే
టీకలేక అనుభవించే
చక్కని సౌఖ్యం కోసం
భాషావాసన ఎరుగని
పరిశ్రమకు సాధ్యపడని
శాస్త్రీయ సంగీతం కాని
స్త్రీయ సంగీతం కోసం

స్వీయ సంకేతం కోసం
తపాలావాని మసిముద్రను
తమాషాగా తప్పించుకొని
తనదాకా నడిచివచ్చే
అణా కార్డు కోసం
దారి మధ్య వలలోపలి
దానిమ్మ గింజలను జూచి
నోరూరక గడ్డి విత్తులు
ఆరగించే పక్షికోసం
మొదటి దివ్వెను వెలిగించి
వెదుకుతున్నాడీ కవి.
నేత్రాలను కప్పివేయని
నీలి ముంగురుల కోసం
బోధి వృక్షాన్ని దాటిన
పూర్వ తేజం కోసం
కంఠంలో నిల్ప గల్గిన
కాలకూట విషం కోసం
ఆడవేషం వద్దించని
అమృతంలాంటి రసం కోసం
ఆలోచనల ఆజ్యంతో
యజ్ఞం చేస్తున్నాడీ కవి.

# శూన్యావరణం

నే నెందుకు వెళిపోతిని
నిశ్శబ్ద శూన్యాబ్ధిలోకి
నిశ్శబ్ద శూన్యాబ్ధిలోకి
నిఖిల జగత్ కుడ్యాలు దూకి.

ఆశలాగు అవతలి సరి
హద్దు సద్దు విన్పించని

అమృతంవలె ఏ నాడూ
అందుబాటులో వుండని
నిశ్శబ్ద శూన్యాబ్ధిలోకి
నే నెందుకు వెళిపోతిని.

చండకరుని కుపిత దృక్కులకు
చంద్రుని సుధా స్నపిత వాక్కులకు
శర్వరీ వినీల హస్త
సంచాలిత తాళవృంతాలకు
నవ్వులకూ కన్నీళ్ళకూ
మల్లెలకూ గులాబి ముళ్ళకూ
లేతగుండె జనానికీ
రాతిగుండె ధనానికీ
దూరంగా—ఊహల ప్రా
కారాలను ప్రాకి ప్రాకి
నే నెందుకు వెళిపోతిని
నిశ్శబ్ద శూన్యాబ్ధిలోకి.

పరిమళాలను పులుముకొన్న
తరళకాంతి తరంగాలు,
ఆకారం మలచుకొన్న
అమృత వీణా స్వరభంగాలు,

పవన సహాయం లేకుండా
ప్రవహించే ప్రసవ నౌకలు,
ఇందుకాంతిలో ముఖాలు
కందని తామరరేకులు,
ఏమేమో ఉంటాయని
ఎందుకు నే వెళిపోతిని
నిఖిల జగత్ కుడ్యాలు దూకి
నిశ్శబ్ద శూన్యాబ్ధిలోకి.

ఎక్కడికీ వెళిపోలేదు నేను
ఎప్పటిచోటే నిల్చున్నాను
మరి శూన్యమంటే ఎక్కడుంది?
మనస్సులో కాపురముంది.

చుట్టూ పసి మనుషుల కేకలు
చుట్టం వచ్చే కబురుచెప్పే కాకులు
ప్రియురాళ్ళు విసిరే చూపులరాళ్ళు
వేదాంతం వడ్డించే ముసలివాళ్లు
అన్నీ ఓ కంట కనిపెడుతూ
ఆందోళన పడుతున్నాను
చుట్టూ ప్రపంచం వున్నా
శూన్యంలో నిల్చున్నాను.

# స్వప్న ప్రశస్తి

నాటక యవనిక లాంటిది
నాలో జారిన స్వప్నం.

ఖండిత నాయిక విగళత్
కైశిక భారం లాంటిది
శర్వరి పెదవుల తొణకిన
శంపాహాసం లాంటిది
నాటకయవనిక లాంటిది
నాలో జారిన స్వప్నం.

మనస్సులకు మత్తెక్కించే
మల్లికా పరిమళాలకు
కనులకు గారడిచేసే
కమనీయమైన ఆకారం,

రణరంగంలో మ్రోగిన
ధనుష్టంకారం గాక
అంబర విశాల రంగంలో
అఖర్వ విజయ గర్వంతో
శరపరంపరలు విసిరే
జలంధరులు మ్రోగించే
ఇంద్రధనుష్టంకారం,

ఏమాత్రం ప్రతిఫలంలేక
ఎంతెంతో చల్లదనాన్ని
ప్రసరించే చంద్రునికి
ప్రతినిత్యం పరిపూర్ణత్వం,

అరసెకండు మాత్రం వెల్గి
మరణించే విద్యుల్లతలకు
రాత్రి సాంతం జీవించే
చిత్రమైన పారస్వాత్వం,

అన్నీ ఒకముహూర్తాన
అనుభవించే అవకాశం
స్వాప్నిక రంగంలోనే
సలిలం లాగా సాధ్యం.

రెక్కలు మొలవకుండానే
రిక్కల రాయడిదాకా
రివ్వున జరిపే ఉడ్డీనం,

గళగ్రంధి విప్పకుండా
స్వరనియతి తప్పకుండా
విన్పించే వ్యోమగానం,

కుపిత నితంబినీ మణి
క్రోడీకృత రోషంతో
వడ్డించిన నొవ్వని మ
వ్వపు గల్ల చపేటం,

అర్థాన్ని ఆకాంక్షించక
పదాలచుట్టూ పరిభ్రమిస్తూ
అనిమిషత్వ మందించే
అమరవేశ్యాకూటం,

సూర్యమండలంలో గీము
చంద్రబింబంలో మకాము
మబ్బుల రాజమహళ్లు
చుక్కల చిక్కని చెక్కిళ్ళు
విద్యుద్వల్లీ డోలికలు
విద్యుత్తును మించిన బాలికలు
గగన పుష్పమ్ములు
కుందేటి కొమ్ములు
పాటపాడే కళ్లు
పల్కరించే నుదుళ్లు
కలల ఎడారుల లోపల
ఖర్జూర తరువుల్లాంటివి.

## తిక్త సమస్యాలు

పొగపోలిక జడలు విప్పి
జగత్తులో వ్యాపించెడు
చీకటులకు చిన్ని తట
ద్రేఖయే ప్రబల శత్రువు.

అహర్నిశలు కనురెప్పల
నణచే నిద్రాళువునకు .
సూర్యకిరణ మొకటి సోక
చురుక్కు మనిపించు గదా

తేనె తేనెగా బ్రతుకును
గానమ్ము ను జేయు మనిషి
తిక్త సమస్యల దాడికి
తికమక పడటం సహజం

ఎంత చిన్న గాలికైన
ఎండుటాకులే మ్రోగును
పచ్చని ఆకులు ఝుంఝూ
పవనానికి మాట్లాడవు.

నీలగిరులవలె పెరిగిన
ధూళి పరంపరల వెనుక
తెలుపేదో నలుపేదో
తెలుపడ మెంతో కష్టం.

నల్లనివైనా వార్షిక
నారదములు సరసమ్ములు
తెల్లని శరదంబుదాల
వల్ల ఏమి ఫలమయ్యా ?
కలమెత్తి కలుషాత్ముల
గజగజ లాడించే కవి
కత్తి చేత ధరియిస్తే
బిత్తరపోదా జగత్తు.

# నిన్నటి చీకట్లు

నిన్నటి చీకట్లు నన్ను
నిలదీసి అడుగుతున్నాయి
సూదిని రెండుగ చీల్చే
సునిశిత పక్కాలో.

"జగన్నేతలు నాగరకతా
శిరోరోహణం పేరుతో
జరిపిన తతంగమంతా
మరిచితివా మనిషీ !

సత్యానికి విలువ సిలువ.
ప్రేమకు తూకం రక్తపతాకం
నెమరువేసుకో మనిషీ
నెమ్మదిగా జీర్ణగతం
ఆవేశంతోడ నడిచి
అడుసులోన అడుగేయకు.

మేకతోలు గప్పుకొన్న పులులు
పులివేషం వేసుకొన్న పిరికి తలలు
పెదవులపై చిరునవ్వును
లత్తుకలా పులుముకొన్న విషాత్ములు
వాళ్లు పరిచిన పన్నాగాల వలలు
వాటిలో కాళ్ళిరుక్కున్న లేతలేళ్ళను
స్మరించుకో మనిషీ!

మాసిన మేధాగ్రంథం
పుటలను తిరగేసి చూడు
పెద్దపెద్ద బొమ్మల్ని చూసి
అద్దుకోకు కళ్ళకు
సన్నని అక్షరాల్లో వున్న
సంగతుల్ని మనోగతంచేయి.

నల్లని చర్మానికి తగిలించిన సంకెళ్ళు
స్వేచ్ఛాపక్షాలకు దడిగట్టిన చెరసాలలు
మానవతా నినాదాల ముసుగుల్లో
పొడిగించిన పశుతత్వం పొలిమేరలు
అణుగోళం కనిపెట్టినవాడికి
ఘనరాజ్యా లర్పించిన కనక బహూకృతులు
శాంతికి జైకొట్టినవాడికి

వింతవింత రంగుల అద్దకం
డబ్బుగాలంలో చిక్కుపడి
తబ్బిబ్బుపడే బడుగురాజ్యాలు
అగ్రశక్తుల గోళ్ళల్లో రక్కుడువడి
అడుగు లేపలేని కుంటిదేశాలు
రెక్కలు తెరచిన అణ్వాయుధాలు
డెక్కలు మొలిచిన మారణాస్త్రాలు
సమరాలంటే తమాషా
మానవ రుధిరాస్వాదనకై
పడమటిగాడ్పుల పిపాస
పసికట్టితివా మనిషీ !
జరిగినదంతా కలయని చప్పరించకు
ఈ స్వప్నమే చక్రంలా
ఇకముందు చంక్రమణం చేస్తుంది.

గతంతో నా కేం పనియని
కళ్ళుమూసినావా మనిషీ"

నిన్నటి చీకట్లు నన్ను
నిలదీసి అడుగుతున్నాయి
సూదిని రెండుగ చీల్చే
సునిశిత ఫక్కీలో.

# రేపటి ఉదయం

రేపటి ఉదయం నాలో
లోపల గుసగుస లాడెను
మనిషీ నీ భవిష్యత్తు
మహోజ్వలంగా వుందని.

"రేపట్లో విశ్వపటం
రూపం పూర్తిగ మారును
రేపట్లో శాస్త్రమహిమ
రేల పగళ్ళుగ మార్చును.

ప్రజ్ఞాశూన్యు లికెన్నడు
పదవులు పాలించలేరు
ప్రచారమంత్రం పఠించి
ప్రజల మూర్ఛపుచ్చలేరు.

మతాలకై మరణించు ఆ
మాయకు లెవ రుండబోరు
గతానికై విలపించే
మృతభావులు కానరారు

రాజకీయములు రోజుకు
రోజుకు రంగులు మార్చవు
బజారులో ధాన్యాలకు
పగలే రెక్కలు మొలవవు.

సృజనాత్మక శక్తిలేని
భజన కీర్తనలు చెల్లవు
కళాపరిమళమే లేని
గద్దిపద్యములు నిల్వవు.

చమక్కు టద్దాలు దాల్చి
చమురు కళ్ళు చాచలేరు
హుళక్కి మాటలతో లో
కుల కళ్లను కప్పలేరు.

సైనిక సంఘుల పేరిట
స్వాభిమాన మణ్మబడదు
శాంతిని రక్షించుటకై
సంగ్రామం జరుగబోదు."

రేపటి ఉదయం నాలో
లోపల గుసగుస లాడెను
మనిషీ నీ భవిష్యత్తు
మహోజ్వలంగా వుందని.

# విచిత్ర ఘటనలు

సన్నని సమీరం తాకిడికి
జలదం గుండె నీరైనట్లు
అల్ప ఘటనకే మనస్సు
అశ్రుసిక్త మవుతున్నది.

జీవిత శైలాగ్రంపై నిల్చి
దృష్టిని దూరం విసరేస్తే
పిపీలికాలకూ మనుష్యులకూ
పెద్దతేడా కన్పించలేదు.

పాతాళాన్ని చుంబించే
బావిలోన కూర్చుంటే
కాక శృతి కోకిల రుతి
ఏకరీతి విన్పించెను.

స్వప్నంలో మూడు తలల
స్వాములు ప్రత్యక్షమైతే
నమస్కరించడం మరచి
నవ్వుకున్నాను బళ్ళా!

శిఖరం తన శిరసెత్తుక
జీమూతాలను క్రమ్ముతుంటే
చీమ యొకటి కళ్ళు మండి
సీత్కారం చేస్తే యేం?

బ్రతుకు ముళ్ళ బాటంటూ
పయనం ఆపేస్తానా?
ఉన్నచోట మాత్రం పూ
లున్నాయా ఏమన్నా.

తలల నిండుగా విషాన్ని
దాచుకొన్న నాగన్నలు
అమృతాంధసుల మంటుంటే
ఆశ్చర్యం కాదా మరి?
కళ్ళయెదుట 'నమస్తే'ల
కాన్కల నందించువారు
వీపు వెనుక విచ్చుకత్తి
మోపుతుంటే గమనించాను.

## మెరుపు బొమ్మలు

మనస్సులోకి తొంగిచూస్తే
కనుపించే మెరుపు బొమ్మలు
కళ్ళతో పల్కడం తప్ప
నోళ్లతో చూడవు.

చేతులతో నడువనేర్చే
కోతిరీతి మనుషులకన్న
కళ్లతో పల్కే బొమ్మలు
కాస్త మెరుగైనవే.

అర్ణవంలా తెరచుకొన్న
అతి నల్లని ఆకాశం
అమాంతంగా ముడుచుకుంటే
అప్పుడెలా వుంటుందో ?

చీకటి ప్రౌఢాంగనవలె
ఆకారం మలచుకుంటే
చుక్కలు జడలో పువ్వులు
సుధాంశుబింబం తిలకం.

హిమాచలం రెక్కలతో
ఎగురడం నేర్చుకుంటే
దాక్షిణాత్యు లొక్కమాటు
తప్పకుండా పిలిచేవాళ్ళు.

మబ్బుల చెరసాలలోన
మెరుపు కటకటాల మధ్య
కుసుమ శృంఖలాలు దాల్చి
కూర్చుంటే బాగుండును.

శిశిరుడు 'డిండిము'డి వోలె
'జెంబా'లను కొడుతుంటె
మధుపతి 'శ్రీనాథు'డై
ఎదుర్కొంటే ఎంతహాయి.

పాతదనం మంచులాగా
గోతాలకొద్ది నిండితే
కొత్తదనం కొరివిలాగా
గుండ్లు తెరిస్తే గమ్మత్.

# స్ఫటిక సౌధం

మత్సరాల పొగ తాకని
మతాల మత్తు సోకని
మైళ్ళదూర తీరాల్లో
కుట్రలకూ కక్షలకూ
కోట్ల యోజనాల మేరలో
స్ఫటిక పట్టికా - విరచిత
సౌధం కనిపిస్తుంది.

గండ పెండేరాల భారాలు
కాశ్మీరు శాలువలు, రత్నహారాలు
'త్వం శుంఠః' ప్రవాదాలు
అహంతా నినానాదాలు
మచ్చుకైనా లే వచ్చుట.

ఆ మేడలో వుండేవారు
అగస్త్య భ్రాతలు కారు.
ఆ మేడలో వుండేవారు
అజాగళస్తనాలు కారు.

ఒక్కొక్కడూ స్వయంగా అగస్త్యుడు
ప్రతివాడూ పదహారణాల మర్త్యుడు.
వాళ్ళు కాసులకు కవిత్వాన్ని పెకలించరు
గుండెల్ని తొలిచే మాటల్ని గుప్తపరచరు.

పసిడి గిన్నెలో విషాన్ని అందించరు
మట్టిచిప్పలో మంచినీ ళ్ళిస్తారు.

రాసక్రీడలు రావు వాళ్ళకి
ప్రాసక్రీడలు తప్ప.

వాళ్ళు వాయించరు తెగిన తంబురాల్ని
రుద్రవీణలు తప్ప.

వాళ్ళు లోకాన్ని నిర్వచిస్తారు
'కుటిలమతులు దేబె మొగాలు
జగతిలో రెండే రెండు రకా'లని.

వాళ్ళు జలపాత స్నాతులు
సమతా విద్యుద్దాతలు.

వాళ్లు నిజంగా కవులు
వాళ్ళు కానివాళ్ళెవరంటే
వాళ్ళు కాని వాళ్ళే.

# మ్రొత్తని సూదులు

దూరం నుంచి వెన్నెలలు
అరగించాలి గాని
చకోరాలు పైబడితే
చంద్రుని గతి యేమికాను ?

వసంతం నిషాలోన
పసందుగా పాడుకునే
కోకిలమ్మను కూచోబెట్టి
పీకనొక్కితే పాడుతుందా ?

గడ్డి మొలిచిన బాటలోన
గమనం సాగించే వాళ్ళు
రోడ్డు మీద నడువా లంటే
రోత పడుతారు లెండి.

కవిత్వాన్ని అత్తగారు
కానుకగా అర్పించిన
బంగరు మొలత్రాడులాగా
భద్రపరుస్తా రేమండీ ?

కనపడకుండా దాగిన
అణువులను ఖైదుచేసి

అగ్నిత్వం ఆపాదించడం
అదేం విజ్ఞానమండీ?

హిమాచలం లాంటి మనిషి
కెల్లరు శిర మొగ్గుతారు
బోడి గుట్ట లన్నిటికీ
పూజ లెవరు చేస్తారు?

రంగంమీద నిల్చుంటే
రత్నాలు రాళ్ళూ తప్పవు
రెంటినీ స్వీకరించేవాడు
కంతేకాలు డవుతాడు.

చంద్రుని మచ్చను చూపడం
అందరికీ చేతనవును
వెన్నెలల మాహాత్మ్యం
వివరించేవాళ్ళు అరుదు.

ప్రతిరోజూ దర్శనమిచ్చే
భానుమూర్తిని కీర్తించక
అగుపడని వానికోసం
అన్వేషణ లెందుకండీ?

నిండుతేనె కుండలోన
నీటిచుక్క వేసినట్లు
మంచిని కబళించడానికి
వంచకు డొక్కడే చాలు.

## దివాంధ ఉవాచ

విద్యుద్దీపాల కాంతి
నాగరికుల మతి భ్రాంతి
ఆముదంపు దివ్వెటీలు
అసలు వెలుగు బావుటాలు.

బురదలోన బ్రతికే కు
మ్మరి పురుగులవోలె మేము
పరిస్థితుల రంగు పైన
బడకుండా తిరుగుతాము.

సిద్ధాంతాలకు మేము
బద్ధుల మేనాడు కాము
'ఏ యెండకు ఆ గొడుగు' అ
పాయము లేదంటాము.

లోకం ముందునకు గొర్రె
దూకుడుగా వెళుతుంటే
మడమలతో వెనక్కువైపు
మస్తుగా నడుస్తుంటాం.

ఉషస్సు కన్పడగానే
విషం మ్రింగినట్లు లవును
అస్తమయం ఎంచేతో
అమృత లిప్త మనిపించును.

దశావతారాలు మాకు
దైనందిన కలాపం
ఉదరపోషణయే మాదు
సదరు జీవితాశయం.

లాభదృష్టియే తప్ప
లోభం మా కెపుడు లేదు
సాంఘిక సంక్షేమానికి
స్వార్థపూజ సలుపుతాము.

అవసరవెల్లియే మాదు
ఆశయసిద్ధికి మూలము
ఒక్క వేషముతో ఎన్ని
దిక్కులని గెలుస్తాము ?
లోకం మా కెదురైతె
లోలోపల కసురుతాము
ముఖంపైన ఎన్నొ మణు
ముల నవ్వులు విసురుతాము.

# చంద్రబింబం ఆరిపోతే

చంద్రబింబం ఆరిపోతే
జగత్తు చిత్రంగా వుండదూ ?
కావ్యవస్తువు పోయిందని
కంగారుపడుతారు కవులు.

యువదంపతు లొక్కమాటు
ఊరుస్తారు నిడుగా
(అంటే నిట్టూరుస్తారు)
చకోరాలు వగైరాలు
తికమకపడి పోతాయి.

సముద్రం గుండె పొరలు
అమాంతం క్రుంగుతాయి.
కళతగ్గని తన ముఖంతో
నిలిచి పోటీచేస్తుందని

ఘుమఘుమలాడే సుందరికి
తృప్తి లవం లభిస్తుంది.
సమాజంలో అక్కడక్కడా
శల్యావశిష్టంగా వున్న
ప్రబంధ నాయికలకు మాత్రం
పరమహర్షం కలుగుతుంది.
తన వేడిని స్వీకరించే
దయా హృదయు డేడీ అని
మొరోయని అరుస్తాయి
ముసలికళ్ళు సూరీడు.
అద్దంలో తనకోసం
అనుదినం వెంచెసే
"మామ' యేడి అమ్మా" అంటూ
మారాము చేస్తాడు మాహాడు.
చంద్రలోకాన్ని పరిశోధించి
చరిత్ర కెక్కుదా మనుకొన్న
శాస్త్రజ్ఞుడు తలపట్టుక
సంతాపం ప్రకటిస్తాడు.
చంద్రబింబం ఆరిపోతే
జగత్తు చిత్రంగా వుండదూ ?

# కొరడా కొసలు

స్వప్నానికీ శాశ్వత
సత్యానికీ మధ్య సాగిన
సమరంలో ఏ రెక్కకు
జయం కలిగిందంటావు?
సన్నాయికీ మద్దెల
చిన్నాయికీ మొన్న జరిగిన
సంప్రతింపు లెంతవరకు
సఫలమైన వంటావు ?

గులాబిపూల కంకర రాళ్లు
కుదించి వేసిన రోడ్డుపై
'కలుక్కు'న కాళ్లకు నాటె
కంటక గణ మేమన్నది?
జలధరాల జంపఖానాలు
అలంకరించిన వేదికపై
'తళుక్కు'న కళ్లను మీటె
తారామణి ఏమన్నది ?

పెదవి కొసల మెరిసే ఇం
ద్ర ధనుర్హాసం చూస్తూ

కళ్లవెన్క దాక్కొన్న మబ్బుల
గమనించక పోయేవు సుమా!
బిగిసిన తంత్రిక పత్కే
ప్రేమగీత మాలకిస్తూ
సరాలు తెగిన వీణియలను
మరచి పోయేవు సుమా!

ప్రసవ కాలంలోన లతలు
పడ్డ శ్రమను గుర్తించి
పండ్ల అమ్మకంలోంచి కొంత
పైకం వాటికి కేటాయించు.
పగలంతా ప్రయాణించి
ప్రస్వేదం ఎరుగలేని
ప్రభాకరుడు పశ్చిమాద్రి
పవళించుట మాన్పించు.

పురాణ పురుషు లధిష్ఠించిన
పుష్పక విమానాల గూర్చి
ఊహించక ఏరోప్లేన్లో
ఒక్క మారు ప్రయాణించు.
'ప్లేన్'లో సీటిప్పించే
వెండి కాగితాలు లేకుంటే

పాటల రెక్కలపై కూచొని
బలేగా ఉడాయించు.



